ఓమ్ గురుభ్యోం నమ:

# విజ్ఞాపనము

మహాశయులారా!

భవదీయామోఘ కృపాతిశయంబను పరతంబు గొనియాడు మదీయ్యా విరచితంబగు యీా చిన్న పొత్తమందలి నెన్ని యో తప్పులుండక మానవనియెమా నమ్మిక మున్నను మన్నించి మీ చిన్నియన్నలవలె మమ్మెంచి కడుంగడు పిన్నయగు నాకయిత కన్నియకు వన్నెదే బోవు భారమియ్యా దేయని మీ కృతజ్ఞతకు మిక్కిలి వేడుకొనుచున్న వారము.

ఇట్లు...

సర్వజన సహృదయ విధేయులు

**శ్రీ సర్వదే యశోద క్రిష్ణమూర్తి రావు**

**శ్రీ సర్వదే గీత సుబ్బారావు**

**శ్రీ సర్వదే భ్యాగవతి పుండరీకరావు**

**శ్రీ ఝూడే కొండారావు.**



మూల గ్రంధకర్త

గా॥ శ్రీయుత సర్వీయ ఝాడే నారాయణ రావు

**తృతీయ ముద్రణ సేకరణ సమర్పణ - 2016.**

శ్రీ సర్పదే యశోద క్రిష్ణమూర్తిరావు

శ్రీ సర్పదే గీత సుబ్బారావు కు॥ శివాంజలిబాయి

శివజితేంద్ర రావు

శ్రీ సర్పదే భాగ్యవతి పుండరీక రావు

శ్రీ సర్పదే కిషోర్ కుమార్ రావు

శ్రీ సర్పదే తిరుమలేష్ రావు.

ఓమ్ హింగులాంబికా భ్యోనమ:

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ శ్రీ మన్మహాశక్తి చిద్రూపిణేశ్వరీ
ప్రణవపంజరశుకీ భవ్యచరితే
ప్రదమపూజితలోక, పావన పదపద్మె
నిగయోపనల స న్నీలకంఠే
చంద్రికాదరహాసె, చండాముండాసుర
ప్రాణాపహరబల ప్రౌఢలసితె
మత్తదంతావళ మర్దన వాహినీ
వనజాతజిత్వర వదనబింబె

గీ॥ పరమ కళ్యాణితత్వాద, భజననెపుడు
భక్తితోజెతునను బ్రోవ, భావ్యమమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ ఓం నమో భగవతీ వ్యోమకేశవధూటి
మోక్షస్వరూపిణీ, దక్షదుహితె
గాయత్రి సావిత్రి, కాత్యాయణి, గౌరి
త్రిపురసుందరి పర దేవిలలిత
నారాయణీయమా, వారాహి వైష్ణవి
పరమేశ్వరీ వీర, భద్రజననీ
అష్టభూజాన్వితే, యర్యా మహామ్మాయి
సారసగర్భాండ, జఠరగోళే

గీ॥ నిన్ను వర్ణింపతరమౌనె నా, కెన్నిగతుల
భూరిసత్కృపతోడన్, బ్రోవమమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ అలతులజాపురీ, యాదిపీఠవినీవే

దయజూచి మమ్ముగావ, తల్లివినీవే

బలవైరి దుర్గాన, భద్రకాళివి నీవె

యహితబాధలమాన్పు, యంబనీవె

కరవీర రాష్ట్రాన, గంజాక్షుసతినీవె

సకలార్థములునిచ్చు జనననీవె

శ్రీప్రతాపగడాన, శివభవానినీవె

మహినోన్నతినిచ్చు మాతనీవె

గీ॥ పరమపావని గీర్వాణి, భవునిరాణి

భూరికృపతోడజగముల, బ్రోతునీవె

వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు

భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ ఆదిపరంజ్యోతి, అమృతస్వరూపిణి
భక్త సంరక్షణి, పాపహరణి
రాజరాజేశ్వరీ, రజితాద్రిమందిరే
నిర్వాణసందాయ, నీ మృడాని
దాక్షాయణీదుర్గి, దాశార్హ సోదరీ
యురగకులాహిత, తురగజనని
వైష్ణవీశాంభవీ, వారాహిచాముండి
భద్రకాశీశ్వరి, రుద్రమదేవి

గీ॥ నిరుపమాన, కృపావీక్షణీ, సమస్తలోక
శుభదాయనీ, భక్తలోక వరదే
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ చందనకర్పూర, శారాదనారద
మందార హిమశైల మారవైది
దర్వీకరాధీశ, శర్వరి నాయక
కేశరి చంద్రిక, వాసవే భ
గగన ధునీక్షీర కాదంబ సురధేను
నక్షత్ర పాండుర, నలినకుంద
భారతీ శతకోటి, నారదదుర్వర్ణ
కావ్యనీలాంబరా, కంబుహీర

గీ॥ ధవళ జత్వర మగుచునీ, తతయశంబు
సర్వదిగ్భాగముల నిండెన సత్యమమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ విహగ రాడ్వాహుండు వింజారమునీవ
పాకారిఛత్రంబు, బట్టినిలువ
పరమేష్టి వేదముల్, పఠనంబు గావింప
మునిజనమ్ములు సూక్తములను చదువ
అమరులు ముకళిత, హస్తులై కొలువంగ
విఘ్నేశ్వరుడు దాండ, వించు చుండ
ఘనభక్తి కిన్నరుల్, గానంబు లోనరింప
వాక్సతిందురులు నివ్వాళులివ్వ

గీ॥ పరమ మోదంబు మీఱంగ, భద్రపీఠి
సమధికైశ్వర్యమున నిల్చి జగతిబ్రోచు
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ సూర్యవంశ సుకీర్తి, కోటిల్లరేణుకా
భూపాలు పుత్రివై, బుట్టితీవు
పుట్టియూ భృగువంశ బ్రాహ్మణో జమదగ్ని
యర్ధాంగివై భువి నలరితీవు
యులరి దురాత్ముల, బరిమార్ప రాముని
కడుపారసూనుగ, వడసితీవు
బడసి భక్తులకోర్కె, ఫలియింపసాధత్రి
యెల్లమాంబాయన వెలసితీవు

గీ॥ వెలసి మావంశ కీర్తుల, వెలయజేసి
నట్టికీర్తి వర్ణింప, నలవియగునె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగుళాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దివ్య తేజఃఖనే, దీవార్తి రంజనే
నిరుపమ సుగుణాధి, నికరభరితే
తాపసాగ్రేసరా, దహర సంచారిణే
మృగవర రోహణే, హింగులాంబ
పాల లోచన తనూ, వామ భోగోజ్వలే
సర్వమంగళ మూష, కార్యమాతె
శరణాగతనేక, సాధు చింతామణే
మత్త మాతంగ స మాసగమనె

గీ॥ పల్లవా స్త్రవిదారణీ, యెల్లంమాంబ
హైమావతి లోక మాత నన్నాదరింపు
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ సర్వ చరాచరా, సత్యప్రకాశినీ
నాదకళాబిందు, యాదిశక్తి
ప్రణవాక్షరీ వేద, ప్రథమ పూజితే దేవి
వివిధ కళామయా, విశ్వరూపె
స్త్రీపుంనపుంభేద, చిన్మయాకారిణీ
సంపూర్ణయౌవన, చారుగాత్రె
సత్వరజస్తమో, సర్వ స్వరూపిణీ
దేహి దేహాంతర, దివ్యతేజె

గీ॥ నిర్మాలానందమూర్తియో, నిర్వకారి
దీనబంధు, చింతామణి, ధీవిశాలి
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ ముగురు మూర్తుల కీవు ముదితవై దల్లివై

గాఢాసురక్తిచే, కాచినావు

దనుజుల తపియింప, ధారుణాయుధ దీప్తి

చెలగ రక్తాక్షివై, వెలసినావు

మోక్షులునిను వేడ, ముక్తి వధూటివై

మోక్షార్థములనిచ్చి, బ్రోచినావు

శాస్త్రార్థములనెల్ల, చదివితర్కింపగ

వేద నిర్మాతవై వెలచినావు

గీ॥ అరయనీకంటె హెచ్చైన, దైవమెవరు

నిఖిల పురుషార్థ శుభాదయ నీ, మృడాని

వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు

భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దుష్టదైత్యవినాశ, దూమకేతువు నీవె

దేవ వధూసౌఖ్య, దిక్కు నీవె

కదనాస్థలిని వీర, కౌతుకంబననీవె

కవిజనాది సుకీర్తి, కాంతనీవె

సభలందు మర్యాద, సంఘటించను నీవె

బహుమాన వరపూజ్య, బంధునీవె

అతిమూర్కవాదంబు, యణగ ద్రొక్కను నీవె

యొంటి జిక్కిన వేళ, బంటునీవె

గీ॥ పరమపావని మాపాలి వ్రతమునీవె

విమలనువిలాస మా యిలవేల్పునీవె

వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు

భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ సంపూర్ణ పూర్ణిమ, చంద్రబింబాననే
సుందర ధావళ్య, మందహాసె
నిరుపమ హరిహాయ, నీలశిరోరు హె
భాసుర రాజివ, పత్రనయనె
పక్వబింబాధరే, పల్లవారుణకరే
భ్రూయుగ విజతాత్మ, భూతనాళె
కంబుసన్నిభగళె, క్రమవాక్యోజ్వలే
మంజుల కుంద స మానరదనె

గీ॥ దేవకాంత సమర్పిత, దివ్యపాదె
నగకులేంద్రాత్మజ సదా, నందశీవె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ విశ్వనిర్మాతవై, వెలుగొందు బ్రహ్మచే
పరుల కసాధ్యమౌ, వరములంది
ఎదురెందులేకను, ముదమున దుష్టులై
దేవజాలముల నల్దిశలదోలి
గంధర్వులను మోది, గరడుల సృక్కించి
కిన్నెరులనుబట్టి, వన్నె మాసి
సిద్దుల నురుగుల, బద్దులగావించి
ప్రళయాగ్ని కీలల, పగదిరేగి

గీ॥ భవనములెల్ల బాధించు, పురనిశాట
మానస మెనరించు శంభు నర్ధాంగివమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ సింహవాహనమెక్కి, చెలరేగిజూచిన
గడగడనలుచడ, ల్వాడకునమ్మ
కన్నులెఱ్ఱగజేసి, ఖడ్గంబుబూనిన
యసురుగుండియ, లదఱునమ్మ
శంఖంబుపూరించి, సంగరంబున నిల్వ
యట్టిట్టుగగన మల్లాడునమ్మ
డమరు కరంబుతో, విమతులదాకిన
శేషునిఫణములు చెదురునమ్మ

గీ॥ విలయ మేఘూర్భటిని నీవు వీరసింహ
రవమెనర్పగ దిగ్గంతు, లవయునమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ క్షోణీధరోదరె శుక్తి ముక్తామణి

భక్త జనావన, భ్రాజమానె

ఋతవాగ్విశారదే వితత యశోధనే

సుప్రసన్నాసన, శుద్ధచరితె

ఉపనిషత్కేళికా, విపిన వనప్రియే

శుభలక్షణోపేత, సురుచిరాంగి

భువనత్రయశ్రేష్ఠ, భోగవిరాజితే

దోషాభ్రపటల నిర్ధూతపననె

గీ॥ భూరిసుక్రోరససుధా, పూర్ణలహరి

చారుమణి నూపురోజ్వల, చరణయుగళె

వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు

భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ బాహూద్ధతినిమించి, పట్టభద్రుల బట్టి
కోపానలంబున, రూపుమాపి
వరవీరధుర్యుల, దురమున సాధించి
వివిధ భూతాళికి, విందొనొర్చి
చటులాహితులనాజి, శస్త్రాస్త్రవితతికి
బలియిచ్చినత్యాంత, ప్రౌఢిమెఱపి
పరగిడువారల బట్టినేలను గూల్చి
బాలుర నిసువుల నేలగలపి

గీ॥ క్షాత్రసతిగర్భములజింపు, జామదాగ్న్య
భీతిహరియించి నృపుల సం ప్రీతిజూచు
వసుధ జమ్ములమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ నీరతంబు నీపాద, నీరజంబులు గొల్చు
దాసులరక్షించు తల్లివమ్మ
సతతంబు నీనామ, సంకీర్తనము చేయు
దీనులను పాలించు దేవివమ్మ
మరియుచు నీదివ్య, మూర్తి జూడగనెంచు
మౌనుల బోషించు మాతవమ్మ
విడువక నీకథ, ల్విన యభీష్టము నొందు
ధన్యులగడదేర్చు, దాతవమ్మ

గీ॥ యిన్ని విధముల పేరొంధి, యున్న నీకు
వందనము సేయననుగావ, వలదె జనని
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ నిసురణంబున జూచి నివ్వెరపాటోంది
దిగ్భ్రమ జెందరె, దివిజరిపులు
నీ పేరు చెవిపోక, నిలుచుబోటును వీడి
పాప పుజంబులు, పరుగులిడవె
నీమంగళాకృతీ, నిండారగాంచిన
భక్తుల కోర్కెలు, పండుటఋదె
నీదివ్యమంత్రంబు, నిత్యంబుపఠియింప
కరతలామలకంబు, గాదెముక్తి

గీ॥ యిన్ని విధముల ముఖ్యమై, యున్ననిన్ను
సన్నుతించిన ననుబ్రోవ, కున్న యశమె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ విశ్వదిగ్మండ లోకేశ్వరీ యీశ్వరీ

పరమంత్రపరతంత్ర, భయ నివారె

శాఖినీ భూత పిశాచాది భేతాళ

బ్రహ్మరాక్షస కోటి, భయ నివారె

సర్వవశీకరీ, సాధుచింతామణే

బాలగ్రగరోగ, భయనివారె

ఘన మెహినీభూత, కామినీ ఢాఖినీ

పరబాధ చోరాది భయ నివారె

గీ॥ చెండి తంతు భైరవమారి, మొండియేటు

దాటువాటుకుటిల విద్య, ధ్వంసి నీవె

వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు

భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దిక్కులు పటపట, వ్రక్కలై పోవంగ
పర్వత గుహలెల్ల, బదులు మ్రోయ
మార్తండ చంద్రులు మార్గముల్దప్పంగ
పాతాల లోకంబు భగ్గుమనగ
వార్ధులేడును గూడి, వారకఘూర్ణిల్ల
ననిమిష లద్భుతం, బనుచుబెగడ
భీకరా రావగం, భీరమ్మైవిలసిల్లు
రణభేరి మ్రోయించి, రహ్వాగతిని

గీ॥ శార్యులగు చండ ముండామి, షాశనులను
వధముగావించు విక్రమో, జ్వలనునీవె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ ఏ శాస్త్రమందెల్ల, వెదక (సర్వంశక్తి మయము)
జగత్తును, మహిమగలదె
ఏయీాశు సేవించి, వేడ (సర్వంశక్తి మయము)
జగత్తును మహిమగలదె
ఏగురుగనుగొని, వినిన (సర్వంశక్తి మయము)
జగత్తును మహిమగలదె
ఏభోధలిన్నను, యెఱుక (సర్వంశక్తి మయము)
జగత్తును మహిమగలదె

గీ॥ సకల భువనేశ్వరీశ్వరీ, శార్యరాణి
బ్రహ్మివైష్ణవీ శాంభవీ, బగళనీవె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ వరదధీచి మునేంద్రు, నిరుపమ కరుణచే
నిఖిల విదల్యనేర్చి, నిపుణుడయ్యె
క్షాత్రసంహారుడౌ, జామదాగ్న్య ప్రతినె
భంగమొనర్చితా, ప్రాజ్ఞమెఱయ
శాస్త్రార్థముల మించి, సమరోక్షోణిమెఱచి
జయసుపప్రకాశుడై, జగతిపొగడ
బాహుసార్ క్షత్రియ, వంశ యశోంశంబు
భూపాలు జయసేను, పొందుటెల్ల

గీ॥ భవదియా కృపాంభోరాశి, ఫలముగాదె
అట్టికరుణయు నేడెందు, నరిగెతల్లి
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ కుటికదైత్యుల బట్టి, కుత్తుకల్దెగగోసి
గుటగుట రక్తంబు, గ్రోలినావు
చనటిదైత్యుల బట్టి, చననీక బిగబట్టి
ఫెళఫెళ నెముకల విఱచినావు
దుష్ట దైత్యుల బట్టి, నష్ట ప్రాణులజేయ
కఱ కఱ కఱ కఱా, దఱగినావు
ఘోరదైత్యుల బట్టి, కుంభినీ బడమెత్తి
వీరనృత్యమ్ము గావించినావు.

గీ॥ భళిరె నీలావు బొడగంగ, బ్రమ్మతరమె
వీర మోహిని త్రిపురారి, విశ్వజనని
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ జయజయభారతి, జయ ప్రకాశనే
జయజయ వాసవీ, జయమృడానీ
జయజయదైత్యారి, జయజగన్మోహినీ
జయజయరేణుకా, జయభవానీ
జయజయయీశ్వరీ. జయజగత్పావనీ
జయజయగీర్వాణీ, జయయపర్ణ
జయజయసావిత్రి జయమౌని సంస్తోత్రి
జయజయనగరాజ జనిత శక్తి

గీ॥ దివ్యమకుట సుభూష దే దివ్యమానె
సుందర లలాట కుంకుమ శోభయక్తె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

## శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ వీక్షించితివి భక్త, వేడుకల్వనివార
నాదరించను కృపా, రసముజెలగ
శిక్షించితివి ఘోర, రాక్షసావళినెల్ల
ముల్లోకములు బహు, మోధమంద
రక్షించితివి దేవ, రాట్బృందముల్లనెల్ల
నవనభాగములచే, సౌఖ్యమంద
భక్షించితివి మహా, పాపఖర్మలనెల్ల
క్షాదేవి యత్యాంత, శాంతమంద

గీ॥ దక్షనందన యాదిమ, ధ్యాంతరహితె
రక్షితామరమూర్తి శ్రీ, రమణిసుగుణి
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ లీలామనోల్లాసె, శైలాధిపాపత్యె
సుకుమార సౌందెర్య, సుందరాంగె
తారేశసమముఖే, సారసపత్రాక్షే
నవమోహనాకార, నవ్యచరితె
మధుర మంజుల భాషె, మందహాసవిలాసె
చంద్రిక పాండుర, చారుకీర్తె
అష్టపాదఘటిత, నవరత్న మాణిక్య
మకర కుండలహార, మాకుటధారె

గీ॥ రమ్యకంకణాంబర రుచి, రమ్మృగనాభి
తిలక పుష్పహారసుభగె, త్రిపురహారె
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ దేవి నమోయంటి దిక్కు నీవనియంటి
పాలించుమంటి నీ బంటనంటి
కనకదుర్గాయంటి, కాళికాంబాయంటి
యన్నపూర్ణాయంటి, యంబయంటి
ఇంగులాంబాయంటి, మంగళాంగీయంటి
కాత్యాయినీయంటి, గౌరియంటి
కడుదీనుడయటంటి, విడనాడకుమటంటి
దరిచేర్చుమనియంటి, శరణటింటి

గీ॥ యన్నివిధముల మొఱసేయుచున్న నన్ను
బ్రోవకుండిన నీఖ్యాతి, పోవునమ్మ
వసుధ జమ్మలమడుగు ని, వాసిని, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

# శ్రీ మదంబా భవాని తారావళి

సీ॥ బ్రహ్మప్రియా నమో, బ్రహ్మరూపిణి నమో
సత్యసంభాషణి, సతినమోస్తు
సర్వేశ్వరీ లోక, సంస్తోత్రిణినమో
సర్వమంగళ గౌరి, సతినమోస్తు
దేవ దేవేశ్వరీ, త్రిజగపూజితేనమో
చంద్రమౌళీశ్వరీ, సతినమోస్తు
పరమేశ్వరీ సదా, బ్రహ్మచారీ నమోస్తు
మానితగుణగణే, తేనమోస్తు

గీ॥ గాన విద్యామనోల్లాసినే నమోస్తు
త్రిజగపూజిత పదయుగే తేనమోస్తు
వసుధ జమ్మలమడుగు నివాసిని, వాసవీ, శు
భాంగి, మాంపాహి, జగదాంబ, హింగులాంబ

నమస్తే నమస్తే నమ:
సంపూర్ణము...